




# వేదములు

విచారణ

## చతుర్ధశ భువనములు ఏవి,ఎక్కడ ?





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్థం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు.వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement**(SAI RAM) **- సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# చతుర్దశ భువనములు

# ఏవి ?

# ఎక్కడ ?

కర్త :

డా॥ కోడూరి సుబ్బారావు

ప్రకాశకులు :

గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)

వ్యాస్‌నగర్, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్-500 361.




యు ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే
ప్రశిషం యస్యదేవాః ।
యస్య ఛాయామృతం యస్య మృత్యుః
కస్మై దేవాయ హవిషా విధేమ ॥

(యజు. 25-13)

ఎవడు ఆత్మదా - పరమాద్భుత మానవ శరీరమును నిర్మించి యిచ్చెనో, బలదా - ఈ అద్భుత యింద్రియశక్తులను ఒసంగెనో, ఏ ఆనంద స్వరూపుని అందఱు ఉపాసించి పొందగోరుదురో, ఎవని వేదప్రబోధిత ఆజ్ఞలను విద్వాంసులు పాలించెదరో, ఎవని ఆశ్రయము సంసార దుఃఖ తాపమునుండి విముక్తుని కలిగించునో, ఎవని అనాశ్రయము మృత్యురూప సంసార సాగరమున తప్తులను జేయునో అట్టి సుఖస్వరూప దివ్యగుణయుక్త పరమేశ్వరుని సత్కర్మలనెడు హవిస్సుతో నమస్కరించుచున్నాము.

# తొలి పలుకులు

కః సప్త ఖాని వి తతర్ద శీర్షణి కర్ణావిమౌ నాసికే
చక్షణీ ముఖమ్ ।
యేషాం పురుత్రా విజయస్య మహ్మని చతుష్పాదో
ద్విపదో యంతి యామమ్ ॥
(అథర్వ, 10-2-6)

సర్వవ్యాపక పరమేశ్వరుడు (మానవ) శిరస్సులో నిర్మించిన రెండు చెవులు, రెండు నాసికా రంధ్రములు, రెండు కన్నులు, ఒక నోరు అయిన సప్త యింద్రియ గోళకములు పరమాద్భుతమైనవి. అమూల్యమైనవి. వాటితోనే ద్విపాద చతుష్పాద జీవులన్నియు లోకమున పరిభ్రమించుచున్నవి. వాటిని తెలుసికొని వానిపై విజయమును సాధించిన మానవుడే గొప్ప యశస్సును పొందును.

నా ఈ సంకలన రచనకు పం॥ శివశంకర కావ్యతీర్థ గారి "చతుర్దశ భువనములు" ఆధారము. వారి గ్రంథము చదివిన తదుపరి నేటి ఆధునిక వైజ్ఞానిక దృష్టి కోణముతో చిన్నచిన్న మాటలతో తెలుగు పాఠకులకు ఆ అద్భుత విజ్ఞానమును తెలుపవలెనను కోరిక కలిగినది. ఆ ప్రయత్నమే యీ లఘు పుస్తకము. ఇందు యేమైన దోషములున్న విద్వాంసులు తెలిపిన మలి ముద్రణమున సవరించుకొనగలను.

వారి మిగిలిన లఘు గ్రంథములు కూడా చక్కగా నున్నవి. వాటిని విద్వాంసు లెవరైనా అనువదించి ప్రచురించగలిగిన జిజ్ఞాసువు లకు గొప్ప మేలు జరుగును. నా కట్టి శక్తి సామర్థ్యములు, ఆరోగ్యము లేకపోవుటచే ఆ ప్రయత్నము చేయలేకపోవుచున్నాను. స్వయముగా నా చేతితో వ్రాయలేని నాకు ధర్మసోదరి శ్రీమతి వేలూరి ఛాయాదేవి సహకరించి వ్రాసిపెట్టినది. ఆమె సహకారము వలననే కొన్ని చిన్న పుస్తకములు వ్రాయగలిగితిని. ఆమెకు నా శుభాకాంక్షలు.

బుధజన విధేయుడు

**కోడూరి సుబ్బారావు**

# ఆదర్శ "ప్రజాసేవక్"



## శ్రీ కీ॥ శే॥ డి. వి. స్వామి గారు

వీరి జన్మస్థానమేదియో, తల్లి దండ్రు లెవరో, బంధు బాంధవు లెవరో, కులగోత్రము లేవియో ఎవరికిని తెలియదు. తనకు తాను వైదిక ధర్మ ప్రచారమునకు జీవితము నంకితము చేసుకొని తన ప్రతి శ్వాసలో ధర్మప్రచారము నింపుకున్న ఆదర్శపురుషుడు. వీరు ఎక్కువగా చదువుకోకపోయినను స్వాధ్యాయము వలనను, విద్వాంసుల ప్రవచనముల వలనను వైదిక సిద్ధాంతముల స్పష్టజ్ఞానమును బొంది అవి సామాన్య ప్రజలలో చిన్నచిన్న మాటలతో ప్రచారము చేసెడివారు. పేద మధ్య ఉన్నత తరగతులలో ఎవరి ఇంటిలో ఏ శుభకార్యము జరిగినను తన శక్తినంతటిని ఉపయోగించి వైదిక పద్ధతిలో ఆకర్షణీయముగా జరుగుటకు కృషిచేసెడివారు. వీరి ఈ సేవాదృష్టిని పరిశీలించియే పూజ్య పం॥ గోపదేవశాస్త్రిగారు వీరికి 'ప్రజాసేవక్' అను

బిరుదునొసంగిరి. తాను ఎవరిదగ్గర అతిథిగా నున్నను వారి యింటి లోనే పరుండి తెల్లవారుఝామున 4 గంటలకే నిద్ర మేల్కాంచి తన కాలకృత్య సంధ్యావందనాదులు పూర్తిచేసికొని ఆ గృహయజమానుల పిల్లలను లేపి వారిచే కాలకృత్య స్నానాదులు గావింపజేసి కొన్ని వేద మంత్రములు, కొన్ని పాటలు నేర్పెడివారు. చిన్నచిన్న మాటలతో ధార్మిక శిక్షణ నొసగెడివారు. ఆంధ్రప్రాంతములో వైదిక సిద్ధాంతములు విరివిగా ప్రచారము కావలెననియు, అందుకు తగిన సమర్ధ విద్వాంసులు పం॥ గోపదేవశాస్త్రి గారనియు గుర్తించి సుమారు 2 దశాబ్దముల కాలము వారి ప్రచార కార్యక్రమములను పలుప్రాంతములలో ఏర్పాటు చేసిరి. అంతేగాక, ప్రజలలో విరివిగా ప్రచారముచేసి, ప్రజలను ఆకర్షించి ప్రవచనములకు తీసుకొని వచ్చెడివారు. తరువాతకూడా వారి వెంటబడి వారిని మూఢ నమ్మకములనుండి తప్పించి వైదిక ధర్మాభిమానులుగా మార్చుటకు ప్రయత్నించెడివారు.

వీరికి మహిళలు ఉన్నతి చెందవలెననియు, వారు వీరాంగనలు కావలెననియు తీవ్ర అభిలాష యుండెడిది. స్త్రీలు సంస్కరింపబడిన వారి పిల్లలు, వారి గృహములు బాగుపడుననియు తద్వారా జాతి ఉన్నతి జెందుననియు నమ్మెడివారు, కూచిపూడిలో అచటి మహిళలను ప్రోత్సాహపరచి ఆర్య మహిళా సమాజము ఏర్పడుటకు కృషిచేసిరి. వారిని వీరవనితలుగా తీర్చిదిద్దుటకు వ్యాయామ శిక్షణ, అస్త్ర శస్త్ర శిక్షణకూడా ఒసంగినట్లు అక్కడివారు చెప్పుదురు. నిజామాబాద్ ప్రాంతములో మహిళలకొరకు పిల్లలకొరకు వారు చేసిన సేవలు ప్రశంస నీయములు. చిక్కడపల్లిలో 'దయానంద మహిళాశ్రమము' అను పేరుతో ఒక అనాథ మహిళాశ్రమమును ప్రారంభించిరి. కాని కొన్ని యిబ్బందుల వలన దానిని మధ్యలోనే వదలివేయుటయు, అది ఎండోమెంట్ వారి స్వాధీనమగుటయు జరిగినది. నిజామాబాద్ సమీపమున

కన్యా గురుకుల మొకటి స్థాపించుటకు విశేష కృషిచేసిరి. కాని అదియును సంపూర్ణము కాలేదు. దీనికి వీరి విలక్షణ స్వభావము కారణము కావచ్చును. ఎవరు ఎన్ని చెప్పినా తనకుతోచినదే తాను చేయు స్వభావము గలవారు. తనకు ఏకొద్ది వ్యతిరేకత ఎదురైనను సహించలేక పోయెడివారు. ఒక చిన్న కారణముతోనే తనకు తాను పం॥ గోపదేవ శాస్త్రిగారి నుండి దూరమగుటయు జరిగినది.

వారి చివరిరోజులలో కర్నూలు జిల్లాలోని బనగానిపల్లిలో గల 'స్వస్తి ఆశ్రమా'నికి చేరుకొని అది కేంద్రముగా రాయలసీమలో ప్రచారము చేయవలెనని కాంక్షించిరి. వెనుకబడిన ఆ ప్రాంతములో కొంత ప్రజాసేవ కూడా జరుగవలెనని 'దయానంద వైద్యశాల' అను పేరుతో ఒక వైద్యశాలను ఏర్పాటుచేయుటకు విశేషముగా కృషిచేసిరి. భాగ్యనగరము, నిజామాబాద్‌ల నుండి చాలా ధనమును సేకరించి తెచ్చిరి. ఆ సమయములోనే కొన్ని విచిత్ర పరిస్థితులలో నేను (కోడూరి సుబ్బారావు) బేతంచెర్ల ఆశ్రమమునుండి బనగానపల్లి ఆశ్రమమునకు రావడము జరిగినది. అప్పటికి నేను శంకరాచార్య భక్తుడను. వారి సిద్ధాంతములపై అత్యంత శ్రద్ధ కలిగియుండెడివాడను. బేతంచెర్ల ఆశ్రమములో అన్ని అనుకూలతలున్నను నేను నమ్మిన శంకరాద్వైత సిద్ధాంతమునకు అక్కడ కొంత భిన్నముగా నుండుటచే ఆ ఆశ్రమమును వదిలిపెట్టి వచ్చితిని. ఆ పరిస్థితులలో నాకు శ్రీ డి. వి. స్వామిగారి పరిచయము, వారి అంతేవాసిత్వము లభించినవి. వారు చిన్న చిన్న మాటలతో వైదిక సిద్ధాంతములను నాకు బోధించెడివారు. అవి నాకు క్రొత్తగానున్నను హేతుబద్ధముగను, విజ్ఞాన సమ్మతముగను కనబడెడివి. దగ్గరలోనే ఉన్న బ్రహ్మముగారి మఠము చూచివచ్చిన భక్తులను బలవంతముగ కూర్చుండబెట్టి శ్రీ స్వామిగారు వైదిక సిద్ధాంతములను బోధించెడివారు. వారి ప్రక్కనే కూర్చుని శ్రద్ధగా వింటూ ఉండేవాడిని.

అందు కొన్ని నాకు నచ్చినను ఎన్నో సందేహములు కలుగుచుండెడివి. వారు పెద్ద విద్యావంతులు కాకపోవుటవలన నా సందేహములలో కొనిటిని వివరించలేక పోయెడివారు. అయినను వారి భావములను గ్రహించి వారు చెప్పునవి సత్యమను నమ్మకము నాకు కలుగుచుండెడిది.

స్వస్తి ఆశ్రమము ఒక విచిత్రమైన ఆశ్రమము. అక్కడ విగ్రహారాధనాది పౌరాణిక కార్యకలాపములు గాని, వైదిక సాంప్రదాయానుకూల సంధ్యాగ్నిహోత్రాదులు గాని, ఏవిధమైన ప్రజా సేవాకార్యక్రమములుగాని యుండెడివి కావు. ఊరుకు దూరముగా ఒక క్రమపద్ధతిలో పెరుగని వివిధ ఫలపుష్పమాలికా సంబంధ వృక్షలతాదులతో పగలు కూడా త్రాచుపాములు స్వేచ్ఛగా సంచరించుటకు అనుకూలమైన విధముగా ఆ తోట (ఆశ్రమము) ఉండెడిది. బావి నివాసమునకు దూరముగా నుండెడిది. అయినను శ్రీ డి. వి. స్వామిగారు తెల్లవారు ఝామున 3 - 4 గంటల ప్రాంతములోనే మేల్కాంచి చిన్న కరదీపిక సాయముతో బావివద్దకు వెళ్ళి స్నానాదులు చేసి వచ్చెడివారు. తెల్లవారి అంతా లేచేవరకు సంధ్య, పాటలు, స్వాధ్యాయములలో గడపెడివారు. తెలవారినప్పటి నుండి రాత్రి పరుండబోయేవరకు ధర్మప్రచారమే వారి పని. వినేవారు ఎవరూ కనబడకుంటే అక్కడ పనిచేయు కూలీలకు ధర్మబోధ చేసెడివారు.

అచట విశాలమైన గ్రంథాలయము ఉండియు ఎవరికిని అందుబాటులో నుండెడిదికాదు. ఆశ్రమవాసులకు కూడా పుస్తకముల నందజేయుటకు వెనుకాడెడివారు. అందుచే అచ్చట చేరిన కొన్ని నెలల తరువాతనే అచట గ్రామములో ఎవరో చదివి యిచ్చిన పాత 'సత్యార్థ ప్రకాశము' నాకు చదువుటకు లభించినది. ఆ పుస్తకమును అనేక మార్లు చదువగా - నా మనసులో అనేక తర్జన భర్జనలు జరుగగా - చివరకు మహర్షి దయానందుని సిద్ధాంతములపై శ్రద్ధ ఏర్పడినది. అందుచే నాకు వైదిక సిద్ధాంతములలో శ్రీ డి. వి. రామస్వామి గారే

ప్రథమ గురువులు. ఆ సిద్ధాంతములను మరికొంత వివరముగా తెలుసుకొన వలెనను కాంక్షతో శ్రీ రామచంద్రరావు మహేంద్రకర్‌గారి ప్రోద్బలంతో ఆదరణతో ఈ భాగ్యనగరమునకు వచ్చుట జరిగినది. నేను అక్కడనే ఉండి దయానంద వైద్యశాలలో సేవ చేయవలెనను కాంక్ష కలిగిన శ్రీ డి. వి. స్వామిగారు అక్కడినుండి వచ్చివేయుటచే నాపై క్రోధితులైరి. తరువాత మాట్లాడుట గాని, ఉత్తరము వ్రాసిన సమాధానము వ్రాయుటగాని చేయలేదు. అయినను నాకు వారిపట్ల శ్రద్ధ కలదు. ఇప్పుడు కాకపోయినా ముందు ముందైనా నన్ను బాగా అర్థము చేసుకోగలరని ఆశించెడివాడను. కాని దురదృష్ట వశమున 1971 ఏప్రిల్ 25 వ తేదీ ఆదివారం వారు మద్రాసు నగరములో మరణించుట జరిగినది.

నిరంతరము సేవచేసియు, తను సేవించిన సమాజ నాయకుల కప్రియుడై ఎక్కడనో మద్రాసు నగరమున కొద్ది పరిచయము గలవారి అండలో జీవనయాత్ర ముగించవలసి వచ్చుట కడు విచారకరము. వారి ఆత్మకు సద్గతి కలిగించవలెనని పరమేశ్వరుని ప్రార్థించుచు ఈ లఘు గ్రంథమును వారికి అంకితము చేయుచున్నాను.

ఓం అగ్నే! వ్రతపతే! వ్రతం చరిష్యామి తచ్ఛకేయం తన్మే రాధ్యతామ్।
ఇదమహ మనృతాత్ సత్యముపైమి ॥

(యజు. 1-5)

హే ప్రకాశ స్వరూప పరమేశ్వర ! ఓ వ్రతపతీ ! వేదములందు నీచే ప్రకటించబడిన సత్యధర్మమునే మేము గ్రహించెదము గాక ! ఉక్త సత్యధర్మము నాచరించి ధర్మార్థ కామ మోక్షముల బొందగల శక్తిని మాకిచ్చి అనుగ్రహింపుము.

—కోడూరి సుబ్బారావు

## మా ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | అగ్నిహోత్రము - వైజ్ఞానిక స్వరూపము | | 4.00 |
| | (డా॥ కోడూరి సుబ్బారావు) | | |
| 2. | వైదిక వైజ్ఞానిక సంస్కృతి | ,, | 4.00 |
| 3. | మానవ ధర్మము | ,, | 2.00 |
| 4. | గాయత్రీ మహిమ | ,, | 2.50 |
| 5. | వైదిక క్రాంతిపథం | ,, | 5.00 |
| 6. | చతుర్దశ భువనములు | ,, | 3.00 |
| 7. | గోమాత | ,, | 5.00 |
| 8. | యుగపురుషుడు శ్రీకృష్ణుడు | | 6.00 |
| | (శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు) | | |
| 9. | వైదిక అర్థనీతి (టి. సూర్యనారాయణ) | | 1.00 |
| 10. | నమస్తే సమీక్ష | ,, | 1.00 |
| 11. | దేవునకు మానవునకు మధ్య.... | ,, | 1.00 |
| 12. | దగాపడిన హిందూ సోదరా | ,, | 1.00 |
| 13. | మహర్షి దయానందుడు | ,, | 1.00 |
| 14. | మనుస్మృతి - పరిశీలన | ,, | 1.00 |
| 15. | వేదములు చెప్పు ధర్మమేమి ? | ,, | 1.00 |
| 16. | వైదిక వివాహ వైశిష్ట్యము | ,, | 3.00 |
| | (సంధ్యావందనం లక్ష్మీదేవి) | | |
| 17 | The Great Gayatri | | 1.00 |

**(పోష్టు ఖర్చులు అదనము)**

## మా రాబోవు ప్రచురణలు

1. పురుషోత్తముడు శ్రీరాముడు
2. ఈశ్వరీయ గ్రంథమేది ?
3. చారిత్రక కాలుష్యము
4. వైజ్ఞానిక సంస్కృతి (2 వ భాగము)
5. మాతా పుత్రికల సంభాషణ
6. ఆరోగ్యకర ఆహారము




# చతుర్దశ భువనములు

సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు తనలోని కోటానుకోట్ల జీవులకు వారు పూర్వ సృష్టిలో చేసిన కర్మఫలముల నిచ్చుటకే ఈ అద్భుత సృష్టిని గావించెను. తనలోని సూక్ష్మజడ ప్రకృతిని ప్రపంచ రూపముగా తయారుచేసి వివిధ దేహములను (జీవరాశులను) నిర్మించి అందు జీవులను ప్రవేశింప జేసెను. ఈ లక్షల జీవరాశులలో మానవుని సర్వోత్తమ ప్రాణిగా సృజించెను. మానవ దేహమునందు వికసించిన యింద్రియములతోబాటు అంతరింద్రియమైన మనస్సు పూర్ణ వికసిత రూపమున నుండును. మనస్సు (బుద్ధి) భగవంతుడు మానవుల కిచ్చిన ఒక గొప్ప వరము. దానిశక్తి అద్భుతము. సాధన జేయుకొలది వికసించుచునే యుండును. అట్టి బుద్ధికి వన్నెతెచ్చునది మానవుని వాణి (వాక్కు). ఆ వాణితో తన మనోభావములను బహిర్గతపరచుచు (వ్యక్తముజేయుచు) శరవేగమున మానవుడు పురోగమించుచున్నాడు. తన బుద్ధితో యీ ప్రపంచ పదార్థములనే గాక విశ్వాంతరాళములోని సూర్యకుటుంబములను కూడా పరిశోధించుచు ముందుకు సాగుచున్నాడు దాని ఫలితమే నేటి ఆధునిక ఖగోళ విజ్ఞానము.

నేటి ఆధునిక ఖగోళ విజ్ఞానము ననుసరించి మనము వసించు ఈ భూమి యీ సూర్యకుటుంబములోని ఒక చిన్న గోళము (గ్రహము). భూమికన్నను పెద్ద గోళములు (గ్రహములు) మరికొన్నిగలవు.

పండువెన్నెల రాత్రి ఆకాశములో కనుపించు నక్షత్రములన్నియు ప్రకాశించు సూర్యులే. వాటిచుట్టు తిరుగుచుండు ఎన్నో గ్రహ ఉపగ్రహములు మనకంటికి కానరాకుండా నుండును. అవి స్వయం ప్రకాశకములు కాకపోవుటచే మనకు గానరావు. బలవత్తరమైన దూరదర్శినితో చూచిన కొన్ని గ్రహములు కనుపించును. సామాన్యకంటికి కనుపించు నక్షత్రములే గాక దూరదర్శినితో మరెన్నో చిన్న నక్షత్రములను మనము చూడగలము. మనకు కనపడు యీ నక్షత్రరాశియంతయు ఒక గెలాక్సీ (Galaxy) మాత్రమేనని వైజ్ఞానికులు చెప్పుదురు. ఇట్టి గెలాక్సీలు యెన్నో కలిసిన ఒక పాలపుంత (మిల్కీ-వే) అగును. మనము నివసించు పాలపుంతయేగాక మరెన్నో పాలపుంతలు యీ విశ్వములో నుండు నవకాశముగలదని వైజ్ఞానికులు చెప్పుదురు. దీనిని బట్టి విశ్వములో కోటానుకోట్ల లోకములుండగ చతుర్దశ భువనముల వర్ణన మాత్రమే మన ప్రాచీన గ్రంథములలో కనబడుచున్నదేల ? మిగతా భువనములగూర్చి తెలియకనా? లేక వాటియందు యే విశేషము లేకపోవుటచేతనా ? శాస్త్రములు వర్ణించు చతుర్దశభువనము లెచ్చట నున్నవి ? అవి నేటి వైజ్ఞానికులకు గానరావేమి ? ఇవి యన్నియు జిజ్ఞాసువులకు ప్రశ్నలుగానే మిగిలిపోవుచున్నవి. పరమేశ్వర వాణియైన వేదములు యీ విషయమునుగూర్చి యేమి చెప్పుచున్నదో పరిశీలింతము.

ప్రథమ మానవ సృష్టి యీ భూమండలముపై ఎత్తైన పీఠభూమిగా కనబడు త్రివిష్టపమున జరిగెను. దానినే నేడు టిబెట్ పీఠభూమిగా పిలుచుచున్నారు. ఆదిమానవ సృష్టి నేటి మాతృగర్భమునుండి శిశు జననమువంటిది గాదు. ప్రథమ మానవులు యువావస్థలో కండ్లు తెరచి యీ లోకమును గాంచిరి. అది అమైథున సృష్టి. ఆ ఆది మానవులకు తల్లిదండ్రులెవ్వరు లేరు. వారు ఒంటరిగా జన్మించలేదు

అనేకమంది స్త్రీ పురుషులు ఒకేసారి ఉద్భవించిరి. ఇది పరమేశ్వర సృష్టిలోని మఱియొక అద్భుత విశేషము.

ప్రాణి సృష్టిని గురించి నేడు ప్రచారములో నున్న డార్విన్ వికాసవాదము సరియైనది కాదు, అందనేక దోషములున్నవి. ఆతని కాలముననే అనేకమంది శాస్త్రవేత్తలు దానిని ఖండించిరి. అయినను బైబిలులో చెప్పిన "ఆరురోజులలో సృష్టిజరిగెను". అను వర్ణనలను అంగీకరించలేని ఆనాటి వైజ్ఞానికులకు మఱొక ప్రత్యామ్నాయము దొరకక ఆపద్ధర్మముగా యీ వికాసవాదము నంగీకరించిరి. డార్విన్ చెప్పినది ఒక అభిప్రాయమే కాని సిద్ధాంతమనుటకు వీలులేదు. అయినను దానినే నేడు విద్యార్థుల మనస్సులలో చెరపలేని ముద్రలుగా బోధించుచున్నారు. క్రీ. శ. 1870 లో స్విట్జర్లాండ్ నివాసియైన గొప్ప భూగర్భ వనస్పతి విజ్ఞానశాస్త్రవేత్త డా॥ (Agasiz) అను అతను తన "Principles of Zoology" అను గ్రంథములో డార్విన్ సిద్ధాంతము దోషపూరితమైనదని నిరూపించెను. ఈమధ్య బ్రిటనులో ప్రఖ్యాత భౌగోళిక శాస్త్రవేత్త అయిన సర్ ఫ్రెడ్ హోయల్ అనునతడు - "ఎన్నో కోట్ల సంవత్సరముల క్రితము విశ్వములోని మరో గ్రహములో మేధాశక్తి గల జీవకోటి ఉండేది. వారి కృషిఫలితమే యీ భూగోళ సృష్టి. ఒక మేధాశక్తి రూపకల్పన చేసి ఉండకపోతే ప్రాణికోటి యింత క్రమ పద్ధతిలో ఉండేదికాదు. సృష్టి కాకతాళీయముగా వికాసవాద మార్గములో జరిగినదనడానికి వీలులేదు" అని లండన్ రాయల్ ఇన్స్టిట్యూట్ శాస్త్రవేత్తల సభలో వివరించిరి. మరొక విషయము ఈమధ్య ఇస్రాయిల్‌లోని కార్మెల్ పర్వతాలకు జెందిన కాబరాల్ హోల్‌లో దొరికిన అస్థిపంజరాలను బట్టి ఒకే కాలములో ఆధునిక మానవుడు, నియాండర్తల్ మనిషి కలిసి జీవించినట్లు తెలియుచున్నది. అందుచే డార్విన్ వికాసవాదము సరియైనది కాదు.

మానవునివలెనే ప్రథమసృష్టిలోని సమస్తప్రాణులు అమైథున సృష్టి జనితములే. అందు మానవులు తప్ప మిగిలిన ప్రాణులన్నియు వాటి జీవన నిర్వహణ కవసరమైన జ్ఞానమంతయు జన్మతోనే (స్వాభావికముగనే) కలిగి యుండును. మానవుడు మాత్రము తన జీవన నిర్వహణ జ్ఞానముకూడా నైమిత్తికముగనే పొందవలసి యుండును. అది నేడును మనము చూచుచున్నాము. అయితే మిగిలిన జీవరాశుల కన్న మానవునిలో నైమిత్తిక జ్ఞానమును గ్రహించు ఒక గొప్ప అంతరింద్రియము గలదు. అదియే బుద్ధి. అందు విశేష బుద్ధిగలిగిన యోగ్యులైన మానవులకు (ఋషులకు) సృష్టి విజ్ఞానమంతయు సృష్ట్యాది లోనే పరమేశ్వరుడు వేదములద్వారా ఉపదేశించి యుండెను. ఈ ప్రపంచములోని సమస్త వస్తువుల గుణగణములతో బాటు విశ్వాంతరాళములోని గ్రహగోళములన్నియు ఏ సూత్రములపై ఆధారపడి పరిభ్రమించుచున్నవో విశదీకరించి యుండెను. వాటిని మననము గావించిన మన ప్రాచీన ఋషులు సూర్యసిద్ధాంతాది అద్భుత జ్యోతిష్య గ్రంథములను రచించిరి. అట్టి జ్ఞానభండారములైన వేదములలో అలంకార రూపములో కొన్ని వర్ణనలు కనబడుచుండును. అవి అలంకారములే గాని చరిత్రలు గావు.

సృష్టిజరిగిన కొంత కాలమునకే చరిత్ర తయారగును గాని మానవసృష్టి ప్రారంభములోనే ఏ చరిత్రయు నుండు నవకాశము లేదు. చరిత్రలో కనబడు వ్యక్తుల పేర్లన్నియు వారివారి తల్లిదండ్రులు వేద పదములతో వారి పిల్లలకు చేసుకున్న నామకరణములే. ఇక పట్టణ నద్యాదుల పేర్లుకూడా ఆది ఋషులు వేదపదములతో ఆయావాటికి చేసిన నామకరణములే. వేదములలోని పేర్లతోనే ఋషులు సృష్టిలోని వివిధ పదార్థములకు నామకరణము చేసినట్లు మనువు తన ధర్మశాస్త్రము నందు స్పష్టముగా చెప్పియుండెను—

శ్లో॥ సర్వాషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్
వేద శబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే ॥
(మనుస్మృతి 1-21)

అనగా ఆది ఋషులే సర్వపదార్థములకు (గోజాతికి గా అనియు, అశ్వజాతికి అశ్వమనియు) మఱియు వేరువేరు కర్మలకు (వేదాధ్యయన అధ్యాపనములు బ్రాహ్మణునకు, రాజ్యపాలనము క్షత్రియునకు, కృషి గోరక్ష వ్యవసాయము వైశ్యునకు. మొదలగునవి), వేరువేరు జాతులకు (మానవ, పశు, పక్షి, క్రిమి కీటకాదులకు) సృష్టి ఆరంభము లోనే వేదశబ్దములచే (పరమాత్మ ప్రేరణతో) నామకరణము గావించిరి.

ఋషి మును లందఱు బ్రాహ్మణాది గ్రంథములలో ఆ దృష్టితోనే వేదములకు వ్యాఖ్యానములు చేసియుండిరి. ఆ తరువాత సాయన, ఉవ్వట, మహీధరాది కొందరు ఆచార్యులు ఒకప్రక్క వేదములు సృష్ట్యాదిలో బహిర్గతమైన జ్ఞానభండారములని చెప్పుచునే మరియొక ప్రక్క ప్రపంచమున జరిగిన చరిత్రకు వేదములలో ఆధారము కలదని వ్యాఖ్యానించి యుండుట దురదృష్టకరము. చరిత్రలో మనకు కానవచ్చే రాజుల, ఋషి మునుల పేర్లన్నియు వేదశబ్దములతో అప్పటివారు చేసుకొనిన నామకరణములే. ఇంతేగాక వృక్ష, పర్వత, నదీనదముల పేర్లుకూడా వేదపదములతో ఆ వృక్ష పర్వత నద్యాదులకు ఋషులచే గావించబడిన (వ్యవహరింపబడిన) నామకరణములే.

వేద పదములకు అర్థము చేయునపుడు మనము లౌకికార్థ దృష్టితో గాక యౌగికముగా అనగా మూలధాతువుల అర్థముల కనుగుణముగా నర్థము చెప్పుకొనవలసి యుండును. ప్రాచీన నిరుక్త నిఘంటువాదులు యీశైలినే అనుసరించి యుండెను. సాయనాదుల తదుపరి వ్రాసిన ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసుల నిఘంటువులలో మాత్రమే లౌకికార్థము

నకు ఎక్కువ ప్రాధాన్యత నీయుట జరిగినది. ఆ ఆధునిక సంస్కృత విద్వాంసుల భావములే నేడు విద్వాంసులలోను, విద్యార్థులలోను ప్రబల మగుచున్నవి. అందుచే వేదములలో వర్ణించిన అలంకారములకు ఆధారము కొఱకు చరిత్ర నన్వేషించుచున్నారే గాని ఆ పదములలోని యౌగికార్థమును బట్టి అందు యిమిడియున్న విజ్ఞానము కొఱకు ప్రయత్నించుటలేదు. అందుచే మనము సత్యమునకు దూర మగుచున్నాము. నేటి వైజ్ఞానికుల దృష్టిలో పామరుల మగుచున్నాము. మనము కించ పరచబడుటయే గాక మన ప్రాచీన ఋషి మునులను, వేదశాస్త్రములను నవ్వులపాలు జేయుచున్నాము.

మన వేదములలో, ప్రాచీన శాస్త్రములలో చతుర్దశ భువనము లున్నట్లు వర్ణనలు కలవు. అవి సప్త ఊర్ధ్వలోకములుగా సప్త అధో లోకములుగా వర్ణింపబడినవి. వాటికి పేర్లుకూడా పెట్టబడినవి. (1) భూలోకము (2) భువర్లోకము (3) స్వర్లోకము (4) మహర్లోకము (5) జనలోకము (6) తపోలోకము (7) సత్యలోకము నను నవి యేడును ఊర్ధ్వలోకములు. (1) అతల లోకము (2) వితల లోకము (3) సుతల లోకము (4) తలాతల లోకము (5) మహాతల లోకము (6) రసాతల లోకము (7) పాతాళ లోకము నను యేడును అధో లోకములు.

ఈ పదునాలుగు లోకములు మనము వసించే భూలోకము వంటి లోకములు కావు. వీటికి మరొక అధ్యాత్మికార్థమున్నది. వేదశాస్త్రముల భావములను చరిత్రతో జోడించి అలంకారముగా యెన్నో అతిశయోక్తులను అభూత కల్పనలను జేర్చి పురాణములు వ్రాసిరి. ఆ అతిశయోక్తుల, ఆ అభూతకల్పనల మధ్య సత్యచరిత్ర సత్యవిజ్ఞానము నివురు గప్పిన నిప్పువలె ప్రకాశించకున్నది. ఇవి వివిధ లోకములనుకొని

విశ్వములో వెతుకుట ఎండమావులవెంట పరుగెత్తుటయే యగును. మన యీ పరమాద్భుత మానవ శరీరములో ముఖమునందు సప్తయింద్రియ గోళకము లున్నవి. అవి రెండు కన్నులు, రెండు చెవులు, రెండు నాసికాపుటములు, ఒక నోరు యీ ఏడింటిని శరీరములోని ఊర్ధ్వాంగ ములుగా చెప్పవచ్చును. ఈ ఏడింటిని వేదశాస్త్రములలో సప్త ఊర్ధ్వ లోకములని వర్ణింపబడెను. వీటినే సప్తఋషులనియు, సప్తహోత లనియు, సప్త ఋత్విక్కులనియు, సప్త దేవతలనియు, సప్త అసురు లనియు, సప్త ప్రాణములనియు, సప్త ద్వీపములనియు, సప్త సాగరము లనియు, సప్త సింధువులనియు, సప్త నదులనియు, సప్త అచలము లనియు, ఇట్టివే మరికొన్ని పేర్లతో ఆయా సందర్భములలో వేదము లలో, ఋషి మునుల గ్రంథములలో అలంకారముగా వర్ణించుటకూడ జరిగెను. అవి యే సందర్భమున వర్ణించినను మన శరీరములోని ఊర్ధ్వాంగములకు వర్తించునేగాని బాహ్యప్రపంచములోని పర్వత నద్యా దులకు గాని, చారిత్రక పురుషులకుగాని వర్తించవు.

అట్లే యీ శరీరములోని రెండు చేతులు, రెండు కాళ్లు, ఒక మలేంద్రియము, ఒక మూత్రేంద్రియము, వీటికి ఆధారమగు ఒక మొండెముతో కలిసి ఏడు అధోంగములగును. వీటినే సప్త అధో లోకములనియు, సప్త అధోభువనములనియు, సప్త పాతాళములనియు, సప్త నరకములనియు వేదములలో వివిధ సందర్భములలో వర్ణింప బడెను. ఇవికూడా బాహ్యప్రపంచములోని లోకములు కావు. శరీ రాంగములే.

ఈ చతుర్దశ భువనములను గూర్చిన యదార్థ వివరణ తెలుసు కున్న మానవులు విజ్ఞానవంతులగుదురు. పరమేశ్వర నిర్మితమైన ఈ అద్భుత యింద్రియ శక్తులను కాపాడుకొనుచు, వృద్ధి చేసుకొనుచు, వాటిని సత్కార్యములందు వినియోగించుచు అభ్యుదయ నిశ్రేయసము లను బొందుదురు.

## పురుష పశువు :

జీవుడు జేసిన పుణ్యాపుణ్య కర్మఫలముల ననుభవింపజేయుటకు పరమేశ్వరుడు జీవుని యీ చతుర్దశ భువనములు (ఊర్ధ్వ అధో అంగములు) గల యీ అద్భుత మానవశరీరములో బంధించుచున్నాడు. ఈ విషయమునే యజుర్వేదము ఎంత చక్కగా వర్ణించుచున్నదో చూడుడు.

సప్తస్యాఽఽసన్ పరిధయస్త్రిః సప్త సమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానా అబధ్నన్పురుషం పశుమ్ ॥
(యజు. 31-15)

యజ్ఞం తన్వానా = యజ్ఞమును చేయుచు
యద్ = ఎప్పుడైతే
దేవా = దేవతలు
పురుషం పశుమ్ అబధ్నం = పురుషుడని చెప్పబడు పశువుని (జీవుని) బంధించుచున్నారో అప్పుడు
అస్య సప్త పరిధయః ఆసన్ = అట్టి యీ యజ్ఞములకు సప్తపరిధులు యేర్పడును. మఱియు
త్రి సప్త సమిధః కృతాః = త్రిగుణిత సప్త ($7 \times 3 = 21$) సమిధలు యేర్పడును.

అనగా యీ శరీరమున వసించు జీవుని పురుషపశు వందురు. ఆ జీవుడు నేత్రాది సప్త యింద్రియ గోళములతో (ఊర్ధ్వాంగములతో) జ్ఞానమును పొందుచుండును. భూమి సూర్యునిచుట్టు ఒక పరిధిలో పరిభ్రమించునట్లే జీవుని శక్తి యింద్రియముల పరిధిలో ప్రకాశించుచుండును. అట్టి ప్రతి యింద్రియముతో కలుగు జ్ఞానము సత్వ రజో తమస్సులను మూడు విధములుగా నుండును. అవియే యిచ్చట త్రిగుణిత సప్త ($7 \times 3 = 21$) సమిధలని వర్ణించబడినవి. వేదములలో అనేక

చోట్ల గోవత్సమును బంధించి యుంచినట్లు భోగముల ననుభవింప జేయుట కొఱకు భగవంతుడు జీవుని యీ శరీరమున బంధించుచున్నా డని చెప్పబడినది.

ఇట్టి ఆధ్యాత్మికార్థములను వదిలి మూర్ఖ పండితులు యజ్ఞవేదిక వద్ద పశువులను బంధించి, వాటి యింద్రియ గోళములను (రంధ్రములను) బంధించి, చంపి, ఆ మాంసముతో ఆహుతులనిచ్చి పాపమును మూటకట్టుకొనెడివారు. అహింసామూర్తియైన బుద్ధుని ప్రబోధము వలన అట్టి శాసనములవలన యీ యాజ్ఞిక పశుహింస అదృశ్యమయ్యెను. కాని వాటి ఛాయలు యిప్పటికిని పండితుల మెదడులలో తిరుగాడుచునే యున్నవి. ఇట్టి క్రూరహింసను బోధించు వ్యాఖ్యాన గ్రంథములను చూసిన వివేకవంతులు వీనిని (యజ్ఞములను) నిరసించుటలో తప్పే మున్నది? ఈ విషయమును స్పష్టపరచు మరియొక వేదమంత్రమును చూడుడు—

## సప్త హోతలు :

యేనేదం భూతం భువనం భవిష్యత్
పరిగృహీత మమృతేన సర్వమ్ ।
యేన యజ్ఞస్తాయతే సప్త హోతా
తన్మే మనః శివసంకల్పమస్తు ॥

(యజు. 34-3)

యేన అమృతేన = ఏ మరణరహితమైన శక్తి (మనస్సు)

| | |
|---|---|
| ఇదం భూతం భువనం భవిష్యత్ సర్వం పరిగృహీతం | ఈ భూత భవిష్యత్ వర్తమాన కాలములను గ్రహించుచుండునో |

యేన యజ్ఞః తాయతే = ఏ మనసు సహాయమువలన యజ్ఞాది క్రతువులు చేయబడుచున్నవో

సప్త హోతా = సప్త హోతలుగల
తత్ మే మనః = ఆ నా మనస్సు
శివసంకల్ప మస్తు = శివసంకల్పములను (మంచి సంకల్పములను) చేయును గాక.

ఈ మంత్రములో మనోవిజ్ఞానముతోబాటు జీవుడు యీ శరీరము ద్వారా జేయు యజ్ఞములో జీవునకు సప్తహోతలు సహకరించుచున్నవని చెప్పబడినది. అవి నయనాది సప్త ఊర్ధ్వ యింద్రియ గోళకములే.

ఈ సప్తహోత లెవ్వరు? అనగా రెండు కన్నులు, రెండు చెవులు, రెండు నాసికారంధ్రములు, ఒక నోరు. కాని తదుపరి విద్వాంసులు భౌతికయజ్ఞ నిర్మాణము చేసినపుడు ఆ సప్తహోతలను యీ విధముగా పేర్కొనిరి. 1. యజమానుడు 2. హోత 3. ఉద్గాత 4. అధ్వర్యుడు 5. బ్రహ్మ 6. పోతా 7. నేష్టా. తదుపరి యజ్ఞ నిర్వహణ సౌలభ్యము కొఱకు మరికొందరు హోతలను కూడా కల్పించిరి. వారు ప్రతి వేదమునకు నలుగురు వేరువేరు హోతలుందురు.

1. ఋగ్వేదము = హోతా, మైత్రావరుణ, అచ్ఛావాక్, గ్రావస్తుత
2. యజుర్వేదము = అధ్వర్యు, ప్రతిప్రస్థాతా, నేష్టా, ఉన్నేతా
3. సామవేదము = ఉద్గాతా, ప్రస్తోతా, సుబ్రహ్మణ్య, ప్రతిహర్తా
4. అథర్వవేదము = బ్రహ్మ, బ్రాహ్మణాచ్ఛాంశీ, పోతా, అగ్నీధ్ర.

తదుపరి విశేష యజ్ఞముల నిర్వహణలలో మరికొంతమంది హోతలను కల్పించిరి. వారు - సదస్యుడు, పత్నీదీక్షితుడు, శమితా, గృహపతి, అంగిర, కైవర్త, చమసాధ్వర్యు, యజమానుడు, యజమాన పత్ని మొదలగు పేర్లతో ఆయా సందర్భములందు వ్యవహరింపబడుదురు.

## సప్త విప్రులు :

ఊర్ధ్వ సప్త భువనములకే సప్త విప్రులను నిర్దేశము కూడా కలదు—

స సుష్టభా స స్తుభా సప్త విప్రైః స్వరేణాద్రిం స్వర్యో నవగ్వైః ।
సరణ్యుభిః ఫలిగమింద్ర శక్ర వలం రవేణ దరయో దశగ్వైః ॥
(ఋ. 1—62—4)

(ఇంద్ర శక్రః) హే ఇంద్రః హే శక్రః (సహః) సుప్రసిద్ధుడవైన నీవు (రవేణ) శబ్దమాత్రముచే (అద్రిం+ఫలిగ+వలం) అద్రి, ఫలిగ, మరియు వల అను ముగ్గురు దుష్టులను (దరయః) సంహరించుచున్నావు. నీవెట్టి వాడవనగా (సప్త+విప్రైః) ఏడుగురు విప్రులతో (స్వర్యః) స్తుతింపబడుచున్నావు. (స్తుభా+స్వర్యః) మరల నీవు ఆ సప్త విప్రులను కీర్తించు చున్నావు. ఆ స్తోత్ర మెట్లున్నదనగా (సుష్టభా) దేనియందు మరల మరల సుందర స్తుతి జరుగునో (స్వరేణ) అట్టి స్తోత్ర స్వర సంయుక్తమై యున్నది. ఆ విప్రులెట్లున్నారనగా (నవగ్వైః) నవగ్వులుగా మఱియు (దశగ్వైః) దశగ్వులుగా మఱియు (సరణ్యుభిః) గమన శీలురుగా నున్నారు.

లోకములో కొందఱు శిశువులు తొమ్మిదవ నెలలోను మఱి కొందరు పదవనెలలోను పుట్టుచున్నారు. ఎవరు తొమ్మిదవ నెలలో పుట్టుదురో వారిని నవగ్వులనియు, ఎవరు పదవనెలలో పుట్టుదురో వారిని దశగ్వులనియు నందురు. ఎందుచేతననగా రజోవీర్యముల కలయిక నుండియే ప్రాణబీజము నాటబడి ఆయుర్దాయము లెక్కించ బడును. అందుచేతనే బ్రాహ్మణ గ్రంథములలో అంగిర ఋషులు రెండురకములుగా నుందురనియు ఒకరు నవగ్వులనియు, మఱియొకరు

దశగ్వ్వలనియు చెప్పబడినది. ఎవరు తొమ్మిది నెలల్లో యజ్ఞసమాప్తి చేయుదురో వారు నవగ్వ్వలు, ఎవరు పదిమాసములలో యజ్ఞసమాప్తి చేయుదురో అట్టివారు దశగ్వ్వలు నగుదురు. మాతృ గర్భములో తొమ్మిది, పది నెలలు నివసించుటయే యజ్ఞానుష్ఠానముగా నెంచవలెను. ఈ కర్ణద్వయ, నయనద్వయ, గ్రహణద్వయ, రసనేంద్రియములనే సప్త ముఖ్య ప్రాణము లందురు. అందుచే వీటిని సప్తవిప్రులుగా యీ మంత్రము పేర్కొనినది. ఇవి గమనశీలము గలవి యగుటచే 'సరణ్య' అని చెప్పబడినది. ఇంద్రు డనగా జీవుడు. అద్రి, ఫలిగ, వల అను మూడును మేఘమునకు పేర్లని నిఘంటువు చెప్పును. కాని యిచ్చట మేఘమువలె ఆవరించు అజ్ఞానమునకు యీ పేర్లు పెట్టబడినవి. మేఘ పర్వతవాచక శబ్దములు అజ్ఞానవాచకముగా గూడ చెప్పబడిన సందర్భము లనేకము గలవు. ఉదాహరణకు వృత్ర, శంబర మొదలగునవి. ఎవరితో పై సప్తప్రాణములు ప్రసన్నములై జీవుని స్తుతించునో (అనుకూలముగా నుండునో) అట్టివారు శారీరక, మానసిక, ఐంద్రియక దుఃఖములను సంహరించ గలరు. ఎంతవరఱకు యీ యింద్రియములు జీవుని అదుపాజ్ఞలలో నుండునో అంతవఱకు అతడు జితేంద్రియు డగును. ఈ సప్త విప్రుల పేర్లనే కొందఱు మానవులు తమ పేర్లుగా పెట్టుకొనుటచే వేదములందు చరిత్ర కలదను భావము పండితులనే భ్రమింప జేసినది — జేయుచున్నది.

## సప్త నదులు :

వేదములలో చతుర్దశ భువనములకే అనేక పేర్లు ఉన్నట్లు మనము చెప్పుకొని యుంటిమి. అందు సప్తనదుల వర్ణన విచిత్రమైనది. ఆ వరన యథార్థ స్వరూప మేమనగా —

ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి
స్తోమం సచతా పరుష్ణ్యా ।
అసిక్న్యా మరుద్వృధే వితస్తయా ఆర్జీకీయే శృణుహ్యా
సుషోమయా ॥
(ఋ. 10-75-5)

గంగే యమునే సరస్వతీ = హే గంగే! హే యమునే! హే సరస్వతీ,
శుతుద్రి పరుష్ణి = హే శుతుద్రీ! హే పరుష్ణి!
మరుద్వృధే ఆర్జీకీయే = హే మరుద్వృద్ధీ! హే ఆర్జీకీయే!
మే ఇమం స్తోమం ఆసచతా = నా ప్రార్థనలను మీరు చక్కగా సేవింపుడు

| | |
|---|---|
| అసికన్యా వితస్తయా సుషోమయా అశృణుహి | అసికన్యా, వితస్తయా, సుషోమయా అను సత్వ రజస్తమో గుణములతో గూడి నామాటలను ఆలకింపుడు. |

పై మంత్రములో ఏడు నదులపేర్లు సంబోధనా విభక్తిలో నున్నవి, అసికన్యా, వితస్తయా, సుషోమయా అను మూడుపదములు తృతీయాంతములుగా నున్నవి. అందుచే వీటిని నదులుగా గాక త్రిగుణములుగా తెలుసుకొనవలెను. పై నదీ పదములకు ప్రాచీన శాస్త్రకారులందఱు బ్రాహ్మణ, ఆరణ్యక గ్రంథములలో యౌగికార్థములనే నిర్వచించిరి. అవి యేవనగా—

1. గంగా = గమనము చేయునది
2. యమునా = నడచునటువంటిది
3. సరస్వతీ = జలపూర్ణమైనది
4. శుతుద్రీ = శీఘ్రగమనము గలది
5. పరుష్ణి = వంకరటింకరగా పయనించునది

6. మరుద్వృధా = వాయువుతో పయనించునది
7. ఆర్జికీయా = ఋజుగమని (సరళముగా పయనించునది)

ఇక త్రిగుణములను చూతము

1. అసిక్నీ = తెలుపుకానిది అనగా నల్లనిది (తమోగుణము)
2. వితస్తయా = విస్తీర్ణమైనది (రజోగుణము)
3. సుషోమా = గొప్ప శాంతిప్రదాయిని (సత్వగుణము)

## ఆధునిక ఆచార్యుల భ్రమ ప్రమాదములు :

ఇట్టి నిర్వచనము లుండగా సాయనాది ఆధునికాచార్యులు యీ పదములతో భూమండలముపై నున్న ముఖ్యముగా భారతదేశములోని నదులనే పేర్కొనుట, చరిత్రలను కల్పించుట, ఆ చరిత్రయే వేదము లందు కలదనుట దుస్సాహసమే యగును. భూమిపై నదులెన్నో యుండగా యేడింటిని గూర్చిన వర్ణనయే ఏల యుండును? ప్రథమ మానవ సృష్టి జరిగిన సమయమున ఉపదేశింపబడిన వేదములలో కాలాంతరమున జరిగిన చరిత్ర యేల యుండును? ఇట్టి వేదశైలిని అర్థము చేసికొనుటకు సాంగోపాంగముగా వేదాధ్యయనము చేయవలసి యుండును. అంగము లనగా శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిష్యములు. ఉపాంగము లనగా న్యాయ వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంత దర్శనములు.

వీటి అధ్యయనముతో బాటు సచ్చరిత్రవంతుడై తాపసిక జీవనము గడుపుచు దృష్టిని అంతర్ముఖము జేయుచు వేదమంత్రములను మననము (మరల, మరల ఆలోచన) జేయవలెను. అట్లు మననము జేయుకొలది అందలి నిగూఢమైన విజ్ఞానము బోధపడగలదు. అంత

ర్యామియైన పరమేశ్వరుడు మంత్రార్థమును సుబోధకము జేయును. అట్టి ప్రయత్నశీలురనే ఋషులందురు. 'ఋషి' పదమునందు గూడా యిదే అర్థము భాసించుచున్నది. జ్ఞానద్రష్ట, మంత్రార్థద్రష్ట అని యీ పదమున కర్థము. వేదవాక్యము లన్నిటిని మంత్రపదముతో వ్యవహరింతురు. 'మంత్ర'మనగా (మననాత్ మంత్ర ఇతి ఉచ్యతే) మననము చేయవలసినది — మరల మరల ఆలోచించవలసినది. ఆ విధముగా నాలోచించువారే మననశీలురు (మునులు) అగుదురు. అట్టి ఋషి ముని హృదయములేని కేవల వాచాపాండిత్యము గలవారు వేదార్థమును గ్రహించలేరు. అట్టి వారి వ్యాఖ్యానములు మనకు ప్రమాణములు కావు.

ఆధునిక వేద భాష్యకారులలో అట్టి ఋషి ముని పంథాల ననుసరించిన వేద వ్యాఖ్యాత మహర్షి దయానందుడు. నైష్ఠిక బ్రహ్మచారియై, యోగాభ్యాసముతో సమాధిస్థుడై మంత్రార్థమును తెలుసుకొనిన మహా మనీషి దయానందుడు. అతనియందు అపారమైన విద్య (వ్యాకరణాది జ్ఞానము), అపారమైన తపస్సు రెండును గలవు.

పై మంత్రములో ఏడు నదులపేర్లు సంబోధనా విభక్తిలోను మూడు పేర్లు తృతీయాంతములుగాను నున్నవి. అందు నదీ పేర్లతో నున్న పదములకు ఊర్ధ్వ యింద్రియ గోళములని గ్రహించవలెను. తృతీయాంతములుగా నున్న మూడింటిని త్రిగుణములుగా నెంచవలెను. ఇట్లే వేదములందు సప్త ప్రాణములు, సప్త లోకములు మొదలగు మాటలకు అర్థము గ్రహించవలెను. ఎప్పుడు యింద్రియములు 'లోక' పదముతో సంబోధింపబడెనో వాటికి భూః, భువః, స్వః, మహః, జనః తపః, సత్యమ్ అను పేర్లు పెట్టబడెను. ఎప్పుడు వీటిని 'అసురు'లని సంబోధింపబడెనో అప్పుడు శంబర, నముచి, ధుని, చుమురి, వల,

అహి, వృత్ర మొదలగు పేర్లు పెట్టబడెను. ఎప్పుడు వీటిని 'పశువు' నని సంబోధింపబడెనో అప్పుడు గో, మేష, అజ, వృక, ఋక్ష, సింహ, వ్యాఘ్ర మొదలగు పేర్లు పెట్టబడెను. అట్లే ఎప్పుడు వీటిని 'నదు'లని సంబోధింపబడెనో అప్పుడు గంగా, యమునా, సరస్వతీ, శుతుద్రీ, పరుష్ణీ, మరుద్వృధా, ఆర్జీకీయ అనుపేర్లు పెట్టబడినవి. కనుక యివి సప్త యింద్రియ గోళములేగాని భౌతిక నదులు కావు.

వేదములందు అనిత్యమైన ఏకదేశకమైన పదార్థముల వర్ణన ఉండదు. వేదములందు ఆకృతి వర్ణన ఉండునే గాని వ్యక్తి వర్ణన ఉండదు. వేదకాలమునాటి ఋషులు యీ భూమిపైనున్న నదులకు వాటి గమనమును పరిశీలించి వేదపదములతో వాటికి నామకరణము చేసి వ్యవహరించి యుండిరి.

పై సప్త నదీవాచక యింద్రియ గోళములు త్రిగుణముల వలన $7 \times 3 = 21$ నదులుగా నిర్వచించిన సందర్భములు వేదములందు అచ్చటచ్చట కాననగును. ఉదా॥—

త్రిః సప్త స్రసా నద్యో మహీరపః । (ఋ. 10—64—8)
ప్ర సప్త సప్త త్రేధాహి చక్రముః (ఋ. 10—75—1)

## సప్త ఊర్ధ్వ లోకములే పంచ జ్ఞానేంద్రియములు :

పై సప్త యింద్రియ గోళములనే పంచ జ్ఞానేంద్రియములుగా గ్రహించవలెనను వర్ణన ఋగ్వేదమునందు కనపడును —

దుహంతి సప్తైకాముప ద్వా పంచ సృజతః ।
తీర్థే సింధోరధి స్వరే ॥
(ఋ 8—72—7)

(అధి స్వరే సింధోః తీర్థే) శబ్దముచేయు సింధువను జలాశయ సమీప మున (సప్త ఏకం దుహంతి) ఒక గోవును ఏడుగురు పిండుచున్నారు. (పంచ ద్వా సృజతః) ఆ అయిదుగురు యిద్దరి కార్యములందు లగ్నమై యున్నారు.

ఇచట వాణి లేక విద్య గోవుగా వర్ణించబడినది. పంచ జ్ఞానేం ద్రియములే స్థాన భేదమువలన సప్త యింద్రియ గోళములుగా వర్ణింప బడెను. ఈ ఏడును అవి గ్రహించు జ్ఞానమును బట్టి పంచేంద్రియములే యగును. రెండు నయనములతో ఒక దర్శనక్రియ, రెండు కర్ణము లతో ఒక శ్రవణక్రియ, రెండు నాసికాపుటములతో ఒక సూంధనక్రియ, ఒక నాలుకతో ఒక రసాస్వాదనక్రియ, చర్మముతో ఒక స్పర్శక్రియ జరుగును. కనుక ఈ యేడును అయిదు పనులనే జేయును. ఈ అయిదు జ్ఞానేంద్రియములు మరియు మనసు జీవునియొక్క కార్యము లందు తత్పరమై యుండును. 'సింధు'వనగా రక్తప్రవాహముగల యీ శరీరము. ఈ శరీరము లోపల సదా గుండె మొదలగువాటి వలన శబ్దము కలుగుచుండుమ. ఇట్టి శబ్దాయమాన శరీరరూప సింధు తటమున సప్త యింద్రియ గోళములు జ్ఞానరూప గోవును పిండుచుండును. మనో జీవాత్మలు వాటి నా కార్యములందు ప్రవర్తింప జేయుచుండును.

అందుచే ఆ అయిదుగురు యిద్దరి (మనో జీవాత్మల) కార్యము లందు లగ్నమైయున్నారని చెప్పబడినది.

## వశిష్ఠుని కథ

మహాభారత ఆదిపర్వములో వశిష్ఠుని గూర్చిన ఒక విచిత్ర కథ గలదు. వశిష్ఠునివద్ద 'నందిని' అను పేరుగల ఒక కామధేనువు ఉండెడిది. అది కోరిన కోరికల నిచ్చెడిది. 'విశ్వావసు' అను, పేరుగల

రాజు రాజ్యవిస్తీర్ణ కాంక్షతో జైత్రయాత్రకు బయలుదేరి విజయుడై రాజధానికి తిరిగివచ్చుచు దారిలో వశిష్ఠుని ఆశ్రమమున విశ్రమించుటయు, అచట నందినిని జూచుటయు జరిగెను. ఎట్లైనను ఆ నందినిని పొందవలెనని విఫల ప్రయత్నము చేసెను. వశిష్ఠుడు నందినిని యిచ్చుటకు నిరాకరించుటచే అతనిలో వైరభావమేర్పడెను. విశ్వవసు తాను బ్రహ్మర్షి కావలెనను కాంక్షతో రాజ్యమును వదిలి ఘోరమైన తపస్సు గావించి విశ్వామిత్రుడను ఋషి అయ్యెను. అయినను అతనికి వశిష్ఠునిపై క్రోధము సమసిపోలేదు. ఒకసారి విశ్వామిత్రుడు వశిష్ఠుని కుమారుల నందరిని చంపివేసెను. ఆ శోకమును భరించలేని వశిష్ఠుడు తన శరీరమును తాళ్ళతో బంధించుకొని చనిపోనిచ్ఛతో ఒక నదిలోపడెను. వెంటనే ఆ నది అతనిని మునిగిపోకుండా పాశవిచ్ఛేదముచేసి ఒడ్డునకు జేర్చెను. ఈ విచిత్రమునుజూచి వశిష్ఠుడు ఆ నదికి 'విపాశ' అని పేరుపెట్టి ముందుకు నడచెను. శోకసంతప్తుడైన ఆ ఋషి మరణించుటకు మరొక ప్రయత్నము చేసెను. మరొక నదిలో దూకగా ఆ నదికూడా అటునిటు విడిపోయి అతనిని చనిపోకుండా కాపాడెను. అది అతనిని తనలో మునుగనివ్వలేదు. అంత వశిష్ఠుడు ఆ నదికి 'శతద్రు' (బహుముఖముగా ప్రవహించునది) అని పేరుపెట్టి ముందుకు నడచెను.

పై కథను పరిశీలించిన వేదములోని శుతుద్రి పదమునే మహాభారతములో శతద్రుగా పేర్కొనుట జరిగినదని తెలియుచున్నది. ఎప్పుడు వశిష్ఠుడు తన శరీరమును బంధించుకొని నదిలో పడగోరుచుండెనో అప్పుడతనిని ఆ నది పాశవిముక్తుని జేసి ఒడ్డుకు జేర్చుచున్నదని కథ చెప్పుచున్నది. ఇదేప్రకారము ముముక్షువు అను ఋషిని జూచి ఇంద్రియములను నదులు పరుగెత్తుచుండెను. అంతేకాని జడములైన జ్ఞానరహితములైన భూగోళముపైనున్న నదులు తనలో పడిన

ఋషిని రక్షించుటలేదు. ఇది ఒక అలంకారిక వర్ణన మాత్రమే. ఇచట ఈశ్వరోపాసకునికే వశిష్ఠుడని పేరు పెట్టబడినది. ఇంద్రియములే ఆ నదులు. ధారణావతియైన ఉత్తమ బుద్ధియే నందినీ ధేనువు. ఇచట విశ్వామిత్రుడనగా విశ్వమునకు కీడుజేయువాడని అర్థము. అనగా అజ్ఞాన అవివేక లోభ మోహాదులు (అసలు విశ్వామిత్రుడనగా విశ్వమునకు మేలుజేయువాడని అర్థము. అట్టి అర్థముతో కూడిన పేరునే విశ్వామిత్రుడు తనకు పెట్టుకొనెను. కాని యీ కథవఱకు మాత్రమే అలంకారిక వర్ణనలో విశ్వ+అమిత్ర=విశ్వామిత్ర యని అర్థము చెప్పుకొనవలసి యుండును). ప్రథమమున యీశ్వర భక్తునకు అవిద్యా అజ్ఞాన లోభ మోహాదులు బహువిధముల కష్టపెట్టును. గోరూప బుద్ధిని హరించుటకు ప్రయత్నించును. గట్టి ముముక్షువు యింద్రియ బలాత్కారములకు వివశుడై ఆత్మహత్యాప్రయత్నము జేయును. అంత అతనిలోని వివేకము అతనిని వారించును. అప్పుడు ఇంద్రియములు "నీ ముముక్షుతకు మేము లొంగిపోవుచున్నాము. ఇకనుండి నీకు విఘ్నములు కలిగించ"మని సమాధాన పరచును. నీ ఈశ్వరోపాసన కొనసాగించమని ప్రోత్సహించును. అనగా ఉపాసకుడు వైరాగ్యవంతుడగుటయు, ఇంద్రియములు సమాధాన పడుటయు జరుగును. క్రమముగా యింద్రియములు వశమగును. ఇట్టివే మన జీవితములోకూడా అప్పుడప్పుడు జరుగుచుండును. కనుక యీ కథ అలంకారరూపమే కాని చరిత్ర కాదు. యాస్కమహర్షి తన నిరుక్తము (3/23) లో యీ విషయమునే యిట్లు నిర్వచించెను.

"ఆర్జీకీయాం విపాడిత్యాహుః........పాశా అస్యాం
వ్యపాశ్యంత వశిష్ఠస్య ముమూర్షతస్తస్మాద్విపాడిత్యుచ్యతే॥

ఆర్జీకీయానే విపాటియని చెప్పబడినది. ఎందుచేతననగా మరణించ గోరిన వశిష్ఠుని పాశములు యిందు తెగిపోయినవి. (విపాటి యనగా

శ్రద్ధలు చేయునది - త్రెంచునది అని యర్థము. గాన విపాటినే పురాణములలో విపాశగా వర్ణించుట జరిగినది.

## విశ్వామిత్రుని కథ

యాస్క శౌనకాదులు ఒక ఆలంకారిక వర్ణన విశ్వామిత్రుని గురించి చెప్పుచు వచ్చిరి. ఒకప్పుడు విశ్వామిత్రుడు పైజవన సుదా అను రాజునకు పురోహితునిగా నుండెడివాడు. ఆ రాజునుండి బహు ధనమును పొంది తీసుకువెళ్లుచు విపాట (విపాశ) శతుద్రీ నదీసంగమమునకు చేరుకొనెను. అతనివెంట ఆ ధనమును దొంగిలించ ఒక బందిపోటు దొంగయు వెంబడించి వచ్చుచుండెను. ఈ ప్రమాదమును కనిపెట్టిన విశ్వామిత్రుడు ఆ నదులను "ఓ నదులారా ! దయచేసి మీరు మెరకవేసి నన్ను దాటనిండు" అని యెలుగెత్తి ప్రార్థించెను. ఆ ప్రార్థనను ఆలంకారిక రూపములో ఋగ్వేదము (3-33-1-13) చాలా చక్కగా వర్ణించెను—

ఋగ్వేద తృతీయ కాండములోని పదమూడు మంత్రములు గల ముప్పైమూడవ సూక్తము కడు విచిత్రమైనది. ఈ మంత్రములకు ఋషి విశ్వామిత్రుడు. ఈ మంత్రముల దేవత — మంత్రవిషయము నదులు. ఈ సూక్తమునందు నదీదృష్టాంతముతో స్త్రీ కర్తవ్యములను గూర్చిన బోధతోబాటు ఒక ఆలంకారిక కథయు భాసించుచున్నది అది యిటులుండును. 'ఓ విశ్వామిత్రా ! మేము జలపూర్ణమై మా నిర్ణయింపబడిన లక్ష్యమువైపు పయనించుచున్నాము. మేము మొదటి నుండియు ప్రవృత్తి మార్గమునే అనుసరించుచున్నాము. నివృత్తి మాకు అభ్యాసము లేదు. అందుచే మేము నిలువలేము. మరి మమ్ముల నెందుకు పిలుచుచున్నావు ?' అని నదులు ప్రశ్నించెను. అప్పుడు విశ్వామిత్రుడు—"ఓ జలపూర్ణ నదులారా ! నా ప్రార్థన నాలకించి

ఒక్క క్షణము నిలుపుడు. మిమ్ముల ను దీర్ఘకాలమునుండి స్తుతి జేయుచు మీ రక్షణ కోరుచున్నాను. కృశిక పుత్రుడనైన నేను మిమ్ము ఆవేదనతో పిలుచుచున్నాను" అని చెప్పెను. అంత నదులు "ఓ విశ్వామిత్రా ! వజ్రబాహుడైన యింద్రుడు భూమిని త్రవ్వి మాకు మార్గముల నేర్పరచెను మమ్ము నాలుగువైపుల ఆవరించిన వృత్రుడిని సంహరించెను. ఆ యింద్రుడే మమ్ము రక్షించుచు నడుపుచున్నాడు. అతని ఆజ్ఞవలననే మేము జలపూర్ణములై ప్రవహించుచున్నాము. ఓ కుశిక పుత్ర విశ్వామిత్రుడా ! నీ ప్రార్థనను మన్నించి మేమెట్లు నిలువగలము' అనెను. అంత విశ్వామిత్రుడు "ఓ నదీ సోదరీమణులారా ! దీర్ఘకాలము నుండి మిమ్ము స్తుతించుచున్న నా స్తుతి నాలకింపుడు. నేను దూర దేశమునుండి రథములో వచ్చితిని. కనుక మీరు నమ్రులై నన్ను దాటి పోనిండు. మెరకవేసి నా రథము పోవుట కనుకూలించుడు." అని దీనముగా ప్రార్థించెను. అంత నదులు "ఓ స్తుతిజేయు ఋషివర్యా ! నీ ప్రార్థనను చక్కగా అర్థముచేసుకొంటిమి. నీవు నీ రథముతో మమ్ము దాటిపొమ్ము. దూరదేశము నుండి వచ్చిన నీకు అనుకూలురమై తల్లి తనబిడ్డకు పాలిచ్చుచు వినమ్రయైనట్లు మేము నమ్రులమై (మెరక వేసి) నిన్ను దాటనివ్వగలము. కనుక దాటిపొమ్ము" అని చెప్పి దాటనిచ్చినవట.

ఈ సంవాదము అతి మనోహరముగా నున్నది. ఒకప్రక్క నదులు యిట్లు చెప్పుచున్నవి. "మా నిర్మాతయైన యింద్రుని ఆజ్ఞను ఉల్లంఘించలేము. మా ప్రతిబంధకములైన వృత్ర, అహిరాక్షసులను చంపి మమ్ము సంకటములనుండి కాపాడిన ఆ యింద్రుని శక్తి అద్భుతము. ఆతని కృపవలననే మేము స్వేచ్ఛగా ప్రవహించుచున్నాము. అట్టి మమ్ము నిలిపి తన ప్రార్థనను ఆలకింపజేయగోరు ఆ విప్రుడెవరు? మేము నిలిచి అతని ప్రార్థన నేల వినవలెను" మొదలగునవి.

